నవశిక్షిత సాహిత్యమాల

# గొర్రెల పెంపకం

రచన

వి. వెంకటప్పయ్య

చిత్రాలు

నౌషాద్ ఆలమ్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ఈ పుస్తకం రాష్ట్ర్రవయోజన విద్యావనరుల కేంద్రం, హైదరాబాదు, ఆంధ్ర ప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా సంయుక్తంగా నిర్వహించిన వర్క్‌షాపులో తయారుచేయబడినది.

ISBN 81-237-2564-7

---

ప్రథమ ముద్రణ 1999 (శక 1920)



GORRELA PEMPAKAM *(Telugu Original)*

**రూ. 7.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ - 110016 ద్వారా ప్రచురింపబడినది.

---

# విజయగాథ - కన్నప్పకథ

మనందరకూ తెలుసు. చిత్తూరు జిల్లా రాయలసీమలో ఉంది. చిట్టగల్లు ఆ జిల్లాలో ఒక ఊరు. చాలా చిన్న గ్రామం. ఆ ఊరిలో ఐదు వందల గడప ఉంది. కన్నప్ప ఆ ఊరిలో ఒక రైతు. అతనికి ఇద్దరు పిల్లలు. అతనికి ఐదు ఎకరాల మెట్ట ఉంది. వర్షం మీదే పైరు ఆధారం. ఏనాడూ సరిగా పండదు. పంట తిండిగింజలకు కూడ చాలదు. చాలీ చాలని బతుకు. కన్నప్ప ఇంటి ప్రక్కనే వి.డి.వో ఉంటారు. వారిద్దరికీ పరిచయం ఉంది. వి.డి.వో కన్నప్పను చూచి జాలి పడ్డాడు. గొర్రెలను పెంచమన్నాడు. ఈ సలహా బాగుంది. తక్కువ పెట్టుబడి. బ్యాంకు రుణం ఇప్పించాడు. కన్నప్ప గొర్రెలను పెంచాడు. లాభం ఏడాదిలో కనిపించింది. మిగతా పేదలూ గొర్రెలను పెంచారు. ఆ ఊరిలో పదింట తొమ్మిది మందికి ఇదే పని. అందరిలో మార్పు వచ్చింది. అంతా హాయిగా వున్నారు. కనుక గొర్రెలను పెంచితే లాభం. దీని వివరాలు కొన్ని తెలుసుకుందాం.

## గొర్రెల పెంపకంలో లాభాలు

పేదవాని నేస్తం గొర్రె. వీటి పెంపకం పేదవారికి ఆనం దం. పేదవానికి తోడుగా ఇవి ఉంటాయి. అవి పాలను




ఇస్తాయి. మంచి ఉన్ని అందిస్తాయి. ఉన్ని కంబళ్ళు చాలా కాలం ఉంటాయి. ఈ కంబళ్ళును చలికి కప్పు

కోవచ్చు. క్రింద పడకగా వేసుకోవచ్చు. పైన వేసుకోవచ్చు. గొర్రె మాంసానికి గిరాకి ఎక్కువ. చాలా మంది దీన్ని తింటారు. పలావు తయారీకి మంచిది. బాగా రుచిగా ఉంటుంది. చర్మానికి రేటు ఉంది. ఎరువు సంగతి సరే సరి. దీనికి చాలా గిరాకి ఉంది. దీన్ని మాగేయాలి. కాస్త నీరు చల్లాలి. మంచి ఎరువు తయారు అవుతుంది. దీని వాడుక రైతులకు ఇష్టం. ఇది చాలా బలమైన ఎరువు. మంచి పంటను ఇస్తుంది. రైతుకు లాభం కలిగిస్తుంది.

## ఎవరైనా పెంచవచ్చు

గొర్రెలు పెంపుడు జంతువులు. వీటిని ఎవరైనా పెంచవచ్చు. పైగా వీటిని పెచడం తేలిక. చిన్నకారు రైతులు, సన్నకారు రైతులు భూమిలేని పేదలు, రైతుకూలీలు, కార్మికులు ఎవరైనా పెంచవచ్చు. అంతేకాదు, వ్యాపార రీత్యా పెంచవచ్చు. పెద్దమొత్తం పెట్టుబడిగా ఉంచవచ్చు. ఇబ్బడి ముబ్బడి లాభం. చిన్నకారు రైతులకు ఇరవై గొర్రెలు, ఒక పొటేలు ఉంటే చాలు. ఇరవై ఒకటిని కలిపి యూనిట్ అంటారు. యూనిట్ ఖర్చు ఏడాదికి పదివేలు. ఓపికను బట్టి ఎన్ని యూనిట్లయినా పెట్టవచ్చు. పిండికొద్దీ రొట్టె. పెట్టుబడి కొద్దీ లాభం.

## గొర్రెల పాకలు

మన ప్రకృతి అతి పవిత్రమైనది. వాతావరణం ప్రాంతాన్ని

బట్టి మారుతుంది. కొన్ని ప్రాంతాలలో ఎక్కువ ఎండ, కొన్ని చోట్ల ఎముకలు కొరికే చలీ. ఎక్కువ కాలం వానా, ఈదురుగాలులూ - ఇలా ఒకే ప్రాంతం ఒకేరకంగా ఉంటుంది. ఏది ఎక్కువున్నా గొర్రెలు తట్టుకోలేవు. వీటి నుంచి గొర్రెలను కాపాడాలి. గొర్రెలకు రోగాలు తేలికగా రావచ్చు. అందుకోసం పాకలు వేయాలి. గొర్రె



లను ఇంటిలో పెంచరాదు. దోమలు చేరతాయి. ఇల్లు రోగాల నిలయం అవుతుంది. అందుచేత పాకలలో వాటిని ఉంచాలి. పాకలకు దడులు కట్టాలి. మరీ ఎక్కువ చలీ, వానజల్లు తగలకుండా ఉండాలి. పాక ఎత్తు కనీసం పది అడుగులు ఉండాలి. అవి మెదలడానికి తగినంత ఎడంఉండాలి. నీరుడు బయటికి పోయే వీలు ఉండాలి. తాగేందుకు మంచి నీరు ఉండాలి. అచటికి దోమలు రాకుండా చూడాలి. క్రిమి కీటకాలు చేరకుండా కాపాడాలి. అందుకోసం నెల కోసారి క్రిమి సంహారక మందులు వాడాలి. తప్పదు.

## గొర్రెలను దాటించడం

గొర్రెల పెంపకంలో మెలకువ పాటించాలి. అవి ఎప్పుడూ ఆరోగ్యంగా ఉండేలా చూడాలి. ఎదకు రాగానే దాటించాలి. ఆలస్యం చేయకూడదు. ఇందుకు మూడు కాలాలు అనుకూలం. ఏప్రిల్-మే మాసాలు మొదటి కాలం. ఈ మాసంలో తుమ్మకాయలు బాగా వస్తాయి. గొర్రెలు వీటిని బాగా తింటాయి. అప్పుడు కొన్ని గొర్రెలు ఎదకు వస్తాయి. ఎదకు వచ్చేవి ఐదోవంతు ఉండవచ్చు. జూన్-జులై మాసాలు రెండవ కాలం. ఆ కాలంలో వానలు పడతాయి. తొలకరి మొదలవుతుంది. పచ్చిక పెరుగుతుంది. లేత పచ్చికను గొర్రెలు బాగా తింటాయి. వాతావరణం మారుతుంది. చల్లబడుతుంది. అప్పుడు సగానికి పైగా

ఎదకు వస్తాయి. నవంబరు, డిశంబరు మూడవ కాలం. ఈ కాలంలో రుతువు మారుతుంది. చలి ప్రారంభం అవుతుంది. పచ్చిమేత బాగా లభిస్తుంది. ఇవి బాగా తింటాయి. అప్పుడు మిగతా గొర్రెలు ఎదకు వస్తాయి. మూడు కాలాలలో అన్నీ ఎదకు వస్తాయి. అలా వచ్చి నప్పుడు వాటిని దాటించాలి. అందుకు మంచి పొట్టేలు కావాలి. దీనిని ప్రత్యేకంగా పెంచాలి. బలంగా ఉంచాలి. ఎలాంటి రోగాలూ దరి చేరనీయరాదు. తరచు పరీక్షలు చేయిస్తూ ఉండాలి. పొటేళ్ళను మందలలో తిరగనీయ వచ్చు. కాని గొర్రెలపై ఎక్కకుండా చూడాలి. మిగతావాటిని పొడవకుండా చూడాలి. ఒక కంట కని పెట్టి ఉండాలి. ఎదకు వచ్చిన గొర్రెలో మార్పు ఉంటుంది. అటూ యిటూ తిరుగుతుంది. బిత్తరచూపుల చూస్తుంది. అరుస్తుంది. ఆ గొర్రెలను వేరు చేయాలి. పొటేలు చెంతకు తీసుకెళ్ళాలి, దాటించాలి. తదుపరి మందలో కలపాలి. దాటించిన తేదీ రాసుకోవాలి. నెలలోపు మరల ఎదకు రాదు. రాకపోతే చూడి నిలచినట్లే. ఎదకు వస్తే మరల దాటించాలి. తగిన జాగ్రత్త తీసుకోవాలి. చూడి గొర్రెలను పరీక్ష చేయించాలి. డాక్టర్ సలహా తీసుకోవాలి.

## ఉన్ని కత్తిరింపు

గొర్రెలు మంచి ఉన్ని ఇస్తాయి. ఈ ఉన్నితో కంబళ్ళు

నేస్తారు. బట్టలు తయారు చేస్తారు. రైతుకు మంచి ఆదాయం తెస్తుంది. కనుక ఉన్ని విషయంలో జాగ్రత్త పడాలి. గొర్రెపై ఉన్ని కొరికే జీవులు చేరనీయరాదు. చేరితే వెంటనే మందులు వాడాలి. వెంట్రుకలు మెత్తగా ఉండేట్లు చూడాలి. మురికి పట్టకుండా చూడాలి. వెంట్రుకలు పెరిగాక కత్తిరించాలి. చలి కాలంలో వెంట్రుకలు కత్తిరించరాదు. ఆ కాలంలో వెంట్రుకలు చలిని ఆపుతాయి. శరీరానికి కవచంగా ఉంటాయి. కాబట్టి వీటి కత్తిరింపుకు జులై నెల మంచిది. కత్తిరింపు ముందు గొర్రెను బాగా కడగాలి. మురికి అంతా పోగొట్టాలి. నిదానంగా కత్తిరించాలి. ఇవి ఎంత పొడవుంటే అంత ధర పలుకుతుంది. రంగును బట్టి ధరలు మారతాయి. మందాన్ని బట్టి మారుతాయి. రైతుకి ఆదాయం తెస్తాయి. వెంట్రుకలూ ఆదాయంలో భాగం అని గమనించాలి.

## చూడి కాలం

గొర్రె చూడి కాలం తక్కువ. అది 140-150 రోజులే. అంటే 5 మాసాలలోపు. ఈ సమయంలో బాగా మేపాలి. మంచి నీరు తాపించాలి. బయట తిరగనివ్వాలి. కడుపులో పిల్ల పెరిగాక బాగా చూడాలి. అదనపు మేత ఇవ్వాలి. పచ్చి మేత తిన్నంత మేపాలి. అదనపు దాణా పెట్టాలి. ఎలాంటి శ్రమ కలుగనీయరాదు. పొలానికి తోలుకుని వెళ్ళరాదు. వీల




యినంత వరకు పాకలో ఉంచాలి. ఈనే కాలం రాగానే మంద వెనుకకు చేరతాయి. వేగంగా నడవలేవు. నిలకడగా ఉండవు. ముందు కాళ్ళతో భూమిని తవ్వుతాయి. పారుకుంటాయి. ఈ మార్పును గమనించి మందనుంచి వేరు చేయడం మంచిది. పాకలో ఒక వైపు శుభ్రం చేసి చూడి గొర్రెను అచ్చటకు చేర్చాలి. అనాయాసంగా ఈనుతాయి. ఈనడం ఆలస్యం అయితే ఆదుర్దాపడవద్దు. పిల్లను బలవంతంగా లాగరాదు. వెంటనే డాక్టర్ సాయం కోరాలి.

## పిల్లల రక్షణ

గొర్రె పిల్లలను సరిగా కాపాడాలి. ఈనగానే పైన జిగురు పదార్థం ఉంటుంది. దీన్ని తల్లిచే నాకించాలి. లేదా నెమ్మ దిగా తుడవాలి. బొడ్డు కత్తిరించాలి. దానిపై టించర్ ఐడిన్ రాయాలి. లేదా డెట్టాల్ రాయాలి. ఇందు వలన క్రిములు బొడ్డును చేరవు. పిల్ల ఆరోగ్యంగా ఉంటుంది. గొర్రె పిల్లకు ముందు జున్ను పాలు మంచిది. వీటిని రోజుకు రెండు, మూడు సార్లు తాగించాలి. ఐదారు వారాలు ఇలా పాలు తాగించాలి. తరువాత కొద్దిగా పచ్చిమేత పెట్టాలి. సులభంగా జీర్ణంఅయ్యే దానా పెట్టాలి. గడ్డి గొద్దిగా పెట్టాలి. క్రమంగా తల్లి నుంచి వేరు చేయాలి. బాగా బయట తిరుగనివ్వాలి. గంతులు వేయనివ్వాలి. అప్పుడు బాగా మేస్తాయి. అరోగ్యకరంగా ఉంటాయి. పెరిగే పిల్లలకు మంచి దానా పెట్టాలి. పచ్చి మేత తగి నంత పెట్టాలి.

## గొర్రెలను మేపడం

గొర్రెలు బాగా మేస్తాయి. ఎంత బాగ మేస్తే - అంత బాగా ఉంటాయి. అంత ఆరోగ్యకరంగా ఉంటాయి. ఇవి పచ్చి మేత బాగా తింటాయి. కలుపు మొక్కలు తింటాయి. ఆకు - అలము తింటాయి. దీనితో పాటు దానా కూడా పెట్టాలి. గొర్రె వయసును బట్టి దానా పెంచాలి. గొర్రె




పిల్లల సంగతి చూద్దాం. పుట్టిన మొదటి మూడు రోజులు ముర్రుపాలు తాగించాలి. తరువాత తల్లిపాలు తాగించాలి. పుట్టిన రెండు వారాల నుంచి దానా పెట్టాలి. పిల్లల దానాను క్రీపు దానా అంటారు. ఈ పొడి పదార్థం బరువులో 4 శాతం ఉండాలి. క్రీపు దానా పాళ్ళు ఇలా ఉండాలి :

60 పాళ్ళు మొక్కజొన్న చూర
17 పాళ్ళు బియ్యం తవుడు
15 పాళ్ళు వేరుశనగ పిండీ
5 పాళ్ళు చేపల పిండీ
2 పాళ్ళు లవణ మిశ్రమం
1 పాలు ఉప్పు.

ఇవన్నీ కలిపి ఈ దానా తయారు చేయాలి. ఈ దానాతో లేత గడ్డి పెట్టవచ్చు. వీటిలో లూసర్న్, స్టయిలో హెమతాసుబాబుల్, వేప ఆకులు మంచివి. మూడు మాసాల దాకా పిల్లలను బాగా పెంచాలి. తరువాత పెద్దవి అవుతాయి. అప్పుడు ,పెద్దవాటికి ఇచ్చే దానా పెట్టవచ్చు. గొర్రెలు పెరగడానికి బాగా మేపాలి. బాగా మేపితే అదునులో ఎదకు వస్తాయి. గొర్రె బరువులో రోజుకు - మూడు శాతం పొడిపదార్థం పెట్టాలి. రోజుకు ఎనిమిది గంటలైనా మేపాలి. ఎప్పుడూ ఒకే చోట మేపరాదు. మేపే స్థలం మార్చాలి. వీటికి తడిగడ్డి మేపరాదు. నీరు నిలచిన గుంటలలో మేపరాదు. నత్త గుల్లలుండే చోట మేపరాదు. అలా చేస్తే - జలగలు నోటిలో ప్రవేశిస్తాయి. రక్తం పీల్చివేస్తాయి. బక్కచిక్కి చచ్చేటట్లు చేస్తాయి.



కనుక వీటికి పొడిగడ్డి మేపాలి. ఎండ వచ్చాక మేపడం మేలు. చూడీ గొర్రెల పోషణ బాగా చూడలి. రోజుకు కనీసం 250 గ్రాముల దానా పెట్టాలి. ఈనడానికి రెండు నెలల ముందునుంచీ పెట్టాలి. అప్పుడు బరువు తూగే పిల్లలను ఈనుతాయి. పుట్టిన పిల్లలు బలంగా ఉంటాయి. ఈనిన తరువాత కూడ మిశ్రమ దానా పెట్టాలి. ఈ దానా పాళ్ళు ఇలా ఉండాలి :

34 పాళ్ళు మొక్కజొన్న నూక
21 పాళ్ళు బియ్యపు నూక
38 పాళ్ళు బియ్యపు తవుడు
4 పాళ్ళు వేరుశనగ పిండి
2 పాళ్ళు లవణ మిశ్రమం
1 పాలు ఉప్పు

అన్నీ కలిపి తయారు చేయాలి.

## మంచి జాతులు

గొర్రెలను పెంచడానికి ఖర్చు అవుతుంది. చాలా శ్రమ ఉంటుంది. అందుకు తగిన లాభం రావాలి. పెంచేవాడు నష్టపోరాదు. నిరాశ చెందరాదు. అలా ఉండాలంటే మంచిజాతి గొర్రెలను సంపాదించాలి. ఈ పనికి ప్రభుత్వం సాయపడుతుంది. ఇందుకు కొన్ని కేంద్రాలు ఏర్పరచింది. విజయనగరం జిల్లా గరివిడి, చిత్తురు జిల్లా పలమనేరు,

నెల్లూరు జిల్లా చింతలదీవి, మహబూబ్ నగర్ జిల్లా మహబూబ్ నగర్ కేంద్రాలు ఇందుకు పనిచేస్తున్నాయి. ఈ కేంద్రాలలో నెల్లూరు జాతి, మాండ్యా జాతి గొర్రెలు దొరుకుతాయి. వీటిని చూడవచ్చు. చూచి మంచివి ఏరుకోవచ్చు. గొర్రెలను దళారుల ద్వారా కొనవద్దు. పెద్దల సలహా పాటించాలి. అనుభవం గల వారి సూచనలు పాటించాలి. డాక్టరు పరీక్ష జరిపించాలి. అపుడు కొనుగోలు చేయాలి. కొన్నపుడు రసీదు పొందాలి.

## గొర్రెలకు వచ్చే రోగాలు

గొర్రెలు సుతిమెత్తనివి. వీటికి రోగాలు ఎక్కువగా రావచ్చు. అందుచేత వీటిని జాగ్రత్తగా పెంచాలి. ముందునుంచీ జాగ్రత్త పడాలి. అంటురోగాలు రాకుండా చూడాలి. ముందుగా టీకాలు వేయించాలి. కాస్త నలతగా ఉంటే చాలు, వైద్యుని పిలిపించాలి. మంచి మందులు వాడాలి. గొర్రెలకు పలు రోగాలు వస్తాయి. చిటుకు రోగం, దొమ్మ రోగం, గాలికుంటు, ముసర వ్యాధి లేదా పారుడు మసూచి, నీలి నాలుక - ఇలా పలు రోగాలు ఆశిస్తాయి. ఈ రోగాలు మామూలుగా వస్తాయి. పాకలో ఉన్నా వస్తాయి. బయట దొడ్లో ఉంచినా ఆశిస్తాయి. గొర్రెలు బయళ్ళలో మేస్తాయి. అప్పుడు కొన్ని రోగాలు వస్తాయి. గడ్డి ద్వారా ఏలిక పాములు, జలగ పురుగులు, కొంకె పురుగులు, గొర్రె




లను చేరతాయి. ఈ రోగాలు వస్తే నీరసపడతాయి. క్రమంగా చనిపోతాయి.

ఇవేగాక

గొర్రెలను కొన్ని చిన్న జీవులు చేరతాయి. అవి - గోమార్లు, పేలు, పిడుదులు - ఇలా కొన్ని ఉంటాయి. వీటి ఎలన గొర్రెలలో రక్తం తగ్గుతుంది. క్రమంగా బలహీన పడతాయి. నీరస పడతాయి. కాళ్ళ సత్తువ తగ్గుతుంది. ఆ తరువాత చనిపోతాయి. రైతులు ఒక సంగతి

గుర్తుంచుకోవాలి. గొర్రెలను తరచు చూస్తూ ఉండాలి. మార్పులు గమనించాలి. ఏ మాత్రం తేడా ఉన్నా వైద్యుని సాయం కోరాలి. అశ్రద్ధ కూడదు. సొంత వైద్యం మంచిది కాదు. ముందే వైద్యం చేయిస్తే ఖర్చు తగ్గుతుంది. త్వరగా కోలుకుంటాయి. వ్యాధి ముదిరిన పిదప వైద్యం ప్రారంభించరాదు. అలా చేస్తే గొర్రె దక్కక పోవచ్చు. కనుక ముందు జాగ్రత్త అవసరం. అలాగే, గొర్రెలను భీమా చేయించాలి. ప్రీమియం కాస్త ఎక్కువే. ఖర్చు ఎక్కువ అయినా తప్పదు. ఇందువలన రైతు నష్టపోడు.

## గొర్రెల వివరాలు

గొర్రెలను పెంచేవారు చదువుకోవాలి. రాయడం తెలుసుకోవాలి. అప్పుడు బాగా లాభం తీయొచ్చు. పెంచే వారికి ప్రతి గొర్రె ఒక బిడ్డ లాంటిది. ప్రతి గొర్రెను గురించీ తెలియాలి. ప్రతి గొర్రె వివరాలు రాసుకోవాలి. ఒక చిన్న పుస్తకం అందుకు ఉంచాలి. ఒకో గొర్రెకు ఒకో పేజీ పెట్టాలి. ఒకో గొర్రెకు ఒక అంకె వేస్తే మంచిది. లేదా గొర్రెకో పేరు పెట్టండి వాటి వివరాలు ఇలా రాయండి:

గొర్రె పేరు, సంఖ్య :
గొర్రె పుట్టిన తేదీ :
పాలు మానేసిన తేదీ :
తొలి ఎద తేదీ :

తొలిసారి ఈనిన తేదీ :
రెండవ ఎద తేదీ :
ఈనిన తేదీ :

ఇలా ప్రతి ఈత రాయాలి

గొర్రెపై నెలవారీ ఖర్చు :
గొర్రెపై నెలవారీ ఆదాయం :
వచ్చిన జబ్బులు :
వాడిన మందులు :
అందుకు అయిన ఖర్చు :

ఇలా వివరాలు రాసుకోవాలి. అందువలన పలు విషయాలు తెలుసుకోవచ్చు.

## ఆదాయం

గొర్రెల నుంచి ఉత్పత్తులు చాల ఉంటాయి. గొర్రెలు పాలు పెద్దగా ఇవ్వవు. ఈ పాలను సరిగా వినియోగించరు. గొర్రెల వలన మూడు ఆదాయాలు ఉన్నాయి. మొదటిది - వెంట్రుకలు, రెండవది - ఎరువు, మూడవది - మాంసం. గొర్రెల వెంట్రుకలకు బాగా గిరాకి ఉంది. రెండేళ్ళ వయసు దాటాక తీయవచ్చు. ఏడాదికి రెండుసార్లు తీయవచ్చు. గొర్రెల ఎరువు పైరుకు బలాన్ని ఇస్తుంది. దీన్ని ఒక గుంటలో వేయండి. నీరు చల్లండి. ఎరువులో సూపర్ ఫాస్పేట కలపండి. మంచి

ఎరువుగా మారుతుంది. దీనికి గిరాకి ఉంది. వెంట్రుకలు, ఎరువు ఆదాయాన్ని పెంచుతాయి. వీటిని దళారులకు అమ్మవద్దు. మార్కెట్ యార్డులో అమ్మడం మేలు. ఇందుకు మంచి ధర వస్తుంది. న్యాయం జరుగుతుంది. కొన్ని గొర్రెలను మాంసం కోసం పెంచుతారు. పెద్దవి కాగానే అమ్మేస్తారు. అప్పుడు రేటు బాగా వస్తుంది. మాంసం, చర్మం రెంటికీ రేటు ఉంటుంది. ఇచ్చట కూడా దళారీలకు అమ్మరాదు. కొనేవారికే అమ్మాలి.

